# శ్రీభద్రశైలరామశతకము.



పోడుగు అప్పలానందముచే రచియింపఁబడి

రామార్పణముగా ప్రచురింపఁబడినది.

కాపీరైటు]     1000 ప్రతులు.     [26-3-1931

# చిన్నవిన్నపము.

ఆర్యులారా!

నేనొకతఱి చైత్రమాసంబున భద్రాచల శ్రీరామ కళ్యాణ సందర్శనాయత్త చిత్తుండనై కొందఱిమిత్రుల తోఁగూడి యటకు యేఁగియుంటిని. అత్తఱి నిచ్చలుపొత్తము ఛందోవ్యాకరణాది శాస్త్రపరిచితియు, ఆంధ్రము, సమగ్రము మొదలగు నిఘంటువులయందైనను విశేషమగు పరిశ్రమ లేకయే చెఱుకునకు వంకపోయిన చెడునెతీపి అను నార్యోక్తి ననుసరించి భక్తితత్పరుడనై భద్రశైల ధామా రామా యను మకుటముంచి వ్రాసికొనియుంటిని. అద్దానిని పరోపకార పారీణులును నా మిత్రులును నగు శ్రీమాన్ మంచుకొండ వేంకటరామయ్యగారి ధనసాహాయ్యముచే అచ్చొత్తించి రామార్పణముగా ప్రచురణచేయగడంగితిని. వారికి నేనెంతయు కృతజ్ఞుడను గాన యిందలి దోషంబుల నెంచక నీరంబును విడనాడి క్షీరంబునే గ్రోలు మరాళంబు రీతి గుణంబులనే స్వీకరించి నాతప్పుల మన్నింప ప్రార్థితులు.

విశాఖపట్టణము, 16-3-31. | ఇట్లు విద్వజ్జనవిధేయుఁడు, పొనుగు అప్పలానందము,



శ్రీ

# భద్రశైలరామశతకము.



కం॥ శ్రీమదఖిల సద్గుణగణ
ధామా! రవివంశసోమ, ధాత్రీజమనః
కామా! క్షితిపాలక, సు
త్రామార్చిత భద్రశైల, ధామా! రామా!॥ 1

కం॥ శ్రీశా! దానవవంశ వి
నాశా! పతితపోష భవవి,నాశా! భువనా
ధీశా! యనినిను వలచెద
దాశరథీ! భద్రశైల, ధామా! రామా!॥ 2

కం॥ శ్రీపార్వతీతనూజుని
శ్రీపాదాంభోజములను, చింతించెదనా
ప్రాపై విఘ్నములుడుపగ
తాపసనుత భద్రశైల, ధామా! రామా!॥ 3

కం॥ వనజజురాణిని బలుమరు
వినుతించెద వదనగుహను, వెలయుటకొరకై
మునిసేవిత పద, దశరథ
తనయా! శ్రీభద్రశైల, ధామా! రామా!॥ 4

కం॥ గురుశ్శేవనియందు నుండునో
గురువతడే గాన నిన్నె, గురువరుగను హృ
త్సరసిజమున స్మరియించెద
ధరసుతహిత! భద్రిశైల, ధామా! రామా!॥ 5

కం॥ సురకిన్నర మునిసంగా!
సిరివర, కరుణాంతరంగ, శ్రితభవభంగా!
కరములుమోడ్చెద గంగా
ధరనుతపద, భద్రిశైల ధామా! రామా!॥ 6

కం॥ రంగా! కలుషతుషార ప
తంగా! ఖగరాట్తురంగ, ధరణిజహృత్సా
రంగమిళిందా! సురస
త్సంగా! శ్రీ భద్రిశైల, ధామా! రామా!॥ 7

కం॥ నగజాతస్తుతనామా!
ఖగవాహన, సమరభీమ, కలుషవిరామా!
పగవానిగ నన్నెంచుట
తగునా! శ్రీభద్రిశైల, ధామా! రామా!॥ 8

కం॥ మిత్రాన్వయ దీపా! సౌ
మిత్రానుజ, పరమభక్త, మిత్రా! ననుసీ
పుత్రునివలె గాపాడుము
ధాత్రిని శ్రీభద్రిశైల, ధామా! రామా!॥ 9

కం॥ శంకా! ననుగాపాడఁగ
పంకేరుహనేత్ర, భక్తపాలక యికనా
వంకను దయగను శ్రీవ
త్సాంకా! శ్రీభద్రశైల, ధామా! రామా!॥ 10

కం॥ ఆరయనీవే శ్రీమ
న్నారాయణమూర్తివనుచు నార్యులుబలుకన్
గోరిస్మరించెద శ్రితమం
దారా! శ్రీభద్రశైల, ధామా! రామా!॥ 11

కం॥ నమ్మితినీవే నాదై
వమ్మనుచును నెమ్మనమున, భక్తదలిర్పన్
యిమ్మా నాకోరికలము
దమ్ములరగ భద్రశైల, ధామా! రామా!॥ 12

కం॥ ఆగ్రహముమాని రవివం
శాగ్రణి నావెతలుబాపి, యరిషట్కములన్
నిగ్రహశక్తిను సౌమి
త్రాగ్రజ శ్రీభద్రశైల, ధామా! రామా!॥ 13

కం॥ జనకజచెంత వసింపఁగ
హనుమంతుఁడు పదములొత్త ననుజులుగొల్వన్
నినుగాంచుటెపుడొ? కన్నుల
తనివారఁగ భద్రశైల, ధామా! రామా!॥ 14

కం॥ తార ఘనసారచందన
సారదహిమశైల సదృశ భాసురయశ సీ
తారమణ, బ్రోవరారా!
ధారుణి శ్రీభద్రశైల, ధామా! రామా!॥ 15

కం॥ సారవిహీనంబగు సం
సారంబున జిక్కి నేను, సారసనాభా!
దారెరుగ నిన్ను జేరగ
ధారుణి శ్రీభద్రశైల, ధామా! రామా!॥ 16

కం॥ పలుమాటలేల నీవే
తలిదండ్రియు గురువు దాత, దైవమటంచున్
పలుమరు నిను నామదిలో
దలచెద శ్రీభద్రశైల, ధామా! రామా!॥ 17

కం॥ నీకై నా కేల్మోడ్చెద
చేకొనుమ పరాకుమాని, శ్రితపాలక, శు
శ్లోకా! రఘుకులవార్ధి సు
ధాకర! శ్రీభద్రశైల, ధామా? రామా!॥ 18

కం॥ కూళనయిదిరిగి యఘముల
జాలుగజేసితిని వాని, చర్చింపకనన్
పాలింపుమయ్య త్వరప
ద్మాలయవర, భద్రశైల, ధామా! రామా!॥19

కం॥ తాటకయను రక్కసికుల
బొటినిగని నీవు వేలు, పులు బొగడంగా
గీటణచవె? మునియాజ్ఞను
దాటక శ్రీభద్రశైల, ధామా! రామా!॥ 20

కం॥ హరచాప విఖండన! భవ
హర, మురహర, కనకచేల, యాశ్రితపాలా!
అరమరసేయక ననునీ
దరినుంపుము భద్రశైల! ధామా! రామా!॥21

కం॥ కోరిన యంతనె భక్తుల
చేరువను వసించికోర్కె, చేకూర్చెదు నీ
కారుణ్యమెందుబోయెను?
ధారుణి శ్రీభద్రశైల, ధామా! రామా!॥ 22

కం॥ నామానసమున నీపద
తామరసయుగంబునిల్పి తగభజియింతున్
క్షేమముగనుంచు, ననునీ
ధామంబున భద్రశైల, ధామా! రామా!॥ 23

కం॥ ఏనీదాసుల దాసుడ
నోనాగమదాపహరణ, యోరణధీరా!
సూనశర సమశరీరా!
దానవహర, భద్రశైల, ధామా! రామా!॥ 24

కం॥ లింగార్చిత పదకమల, భు
జంగాధిపశయన, పాప, సంచయభంగా!
గాంగేయవసన, మునిస
త్సంగా! శ్రీభద్రశైల, ధామా! రామా!॥ 25

కం॥ నీసంబైనను పుణ్యము
జేసియెరుగ నన్ను నీవు చేపట్టెదవో?
గాసిని బెట్టెదో? నీదగు
దాసుడనో భద్రశైల, ధామా! రామా! 26

కం॥ జననీజనకుల ననుజుల
దనయుల సతి సుతుల హితుల, ధనధాన్యములక
గని నిన్ను దలచ మరచితి
దనుజాంతక భద్రశైల, ధామా! రామా!॥ 27

కం॥ దండంబిడె రాక్షసకుల
ఖండన, కుండలశయాన, కంజదళాక్షా!
పండితకవిపక్షా! వే
దండావన, భద్రశైల, ధామా! రామా!॥ 28

కం॥ భజె గోవింద ముకుందా!
భజె సన్ముని బృందవినుత, పాదద్వంద్వా!
భజెదానవ హర గరుడ
ధ్వజ! మాధవ భద్రశైల, ధామా! రామా!॥29

కం॥ రారా! నామనవిని గై
కోరా! నాపయినియింత, కోపంబేరా!
మేరా? నీకిదిజగదా
ధారా! శ్రీభద్రశైల, ధామా! రామా!॥ 30

కం॥ నీమముతో నీనామము
నామదిలో దలచుచుంటి, నానాగతులన్
కామితముల నొడగూర్చుము
దామోదర, భద్రశైల, ధామా! రామా!॥ 31

కం॥ నే పూర్వజన్మమున నే
పాపము, లొనరించినానో? పరిపరిగతులన్
కాపాడుమన్న గావవు
తాపసినుత, భద్రశైల, ధామా! రామా॥ 32

కం॥ అన్నా! నినునమ్ముచు నే
నున్నాడను బ్రోతువనుచు నుత్సాహముతో
కన్నెడజేయక బ్రోవగ
దన్నా! శ్రీభద్రశైల, ధామా! రామా!॥ 33

కం॥ నీనామ మహిమలెన్నగ
నానాగాధిపునకైన, నలవియెయనగా
నేనెంతవాడ మనుజుడ
దానవహర, భద్రశైల, ధామా! రామా!॥ 34

కం॥ అంబుజలోచన, నాపా
పంబుల దెగదుంచి బ్రోవ, భక్తితో నీపా
దాంబుజముల నమ్మితి పీ
తాంబరధర భద్రశైల, ధామా! రామా!॥ 35

కం॥ కరి మకరిచేత జిక్కియు
పరిపరివిధములనునిన్ను, ప్రార్థింపంగా
వెరువకుమని కరిగాచిన
ధరసుతహిత, భద్రశైల, ధామా! రామా!॥36

కం॥ అంగజజనకా! భవహర,
సంగరరిపు సైన్యనాశ, సజ్జనపోషా!
వెంగలివీడని విడకు ప
తంగధ్వజ భద్రశైల, ధామా! రామా!॥ 37

కం॥ కోపమదేలను నీదగు
పాపనిగ దలంచినన్ను, బాలింపుమునీ
శ్రీపదముల నెదనమ్మితి
తాపసినుత భద్రశైల, ధామా! రామా!॥ 38

కం॥ మానవుడ, జ్ఞానహీనుడ,
పూనికచే నిన్ను నేను, పూజింపంగా
లేను ననుయెటుల బ్రోచెదో?
దానవహార, భద్రశైల, ధామా! రామా!॥ 39

కం॥ పాపాత్ముఁడు వీనిని యిక
గాపాడఁగ రాదటంచు, గన్నడ జేయన్
జేపట్టు వారలెవ్వరు?
తాపసినుత, భద్రిశైల, ధామా! రామా!॥ 40

కం॥ వెరువను యమకింకరులకు
మరువను నీనామభజన, మానసమందున్
తిరుగను దుర్జనతతితో
ధరసుతహిత, భద్రశైల, ధామా! రామా॥41

కం॥ నగభేదివినుత, భవహర!
నగధర, సర్వేశ, శ్రీశ, నగధరసఖ, నన్
పగవానిగ మదినెంచుట
తగదుర శ్రీభద్రిశైల, ధామా! రామా!॥ 42

కం॥ దొరతనముచేత నాదిగు
మొరచెవులకు జొరనదేమొ? మునిపూజితనన్
కరుణించు వారలెవ్వరు?
ధరణిని శ్రీభద్రిశైల, ధామా! రామా!॥ 43

కం॥ సోమార్కనేత్ర, సద్గుణ
ధామా! రిపుభీమ, జలజ, దళసమనయనా!
బాములు బెట్టక బ్రోవర
దామోదర, భద్రిశైల, ధామా! రామా!॥ 44

కం॥ సరమృగహింసా! భవహర,
నరవందిత పాదయుగళ, నగధర సఖ స
న్నరమరజేయక బ్రోవర,
ధరణిని శ్రీభద్రశైల, ధామా! రామా!॥ 45

కం॥ అలనాడు కుచేలుం డటు
కులు పిడికెడొసంగ వాని, కూర్మితొగొనుచున్
కలుము లొసంగెదు నినుమది
దలచెదనో భద్రశైల, ధామా! రామా!॥ 46

కం॥ పగవానినైన బ్రోవగ
తగుకంకణమును ధరించు, దాతవనుచునిన్
దగిలి మొరబెట్ట బ్రోవవు
తగునా? శ్రీభద్రశైల, ధామా! రామా!॥ 47

కం॥ ననుబోలు పాతకుండును
నినుబోలిన సత్ప్రభుండు, నిహపరములలో
గనుగొనగ నెవరులేరుగ
దనుజాంతక భద్రశైల, ధామా! రామా?॥ 48

కం॥ ధరణిని నీసరివేలుపు
లరయంగా లేరటంచు, నార్యులుబలుకన్
మరువక దలచెద సీతా
తరుణీపతి, భద్రశైల, ధామా! రామా!॥ 49

కం॥ కలుములచెలి ప్రాణేశ్వర,
చెలువలదొర సెజ్జపైన, చెలగెడువాడా!
కలుషములబాప నినుమది
దలచెద శ్రీభద్రశైల, ధామా! రామా!॥ 50

కం॥ నీరజలోచన శ్రీమ
న్నారాయణ వాసుదేవ, నగధరయనినిన్
గోరిభజించెద జగదా
ధారా! శ్రీభద్రశైల, ధామా! రామా!॥ 51

కం॥ జనకసుత ప్రియమనోహర!
కనకాంబర, నీలదేహ, కారుణ్యనిధీ!
మనసిజ జనక, పరాత్పర,
దనుజాంతక, భద్రశైల, ధామా! రామా!॥52

కం॥ కనుభక్తితోడ నీదగు
ననుగుల నెరనమ్మియుంటి, నయ్యా! ననుని
యనుగుల దరినుంచగనీ
తడవేలను? భద్రశైల, ధామా! రామా!॥ 53

కం॥ కరములు శిరమున జేరిచి
సురవందిత పాదయుగళ, సుందరగాత్రా!
కరివరద, యనుచు దలచెద
ధరలో శ్రీభద్రశైల, ధామా! రామా!॥ 54

కం॥ తొలినే జేసిన పాపమొ?
కలికాలపుమహిమొ? అటుల గాకుండిననే
బలుమారు బిలువ బలుకవ
దలపవు మది భద్రశైల ధామా! రామా!॥ 55

కం॥ శ్యామల సుందర దేహా!
తామరసదళాయతాక్ష, దనుజవిపక్షా!
కామితఫల సందాయక!
దామోదర, భద్రశైల, ధామా! రామా!॥ 56

కం॥ క్షమ్మహిసీ మృదుచరణా
జమ్ముల నెదనమ్మియుంటి, చయ్యన నాపా
పమ్ముల జిమ్మెదవనుచు ము
దమ్ములరగ భద్రశైల, ధామా! రామా!॥ 57

కం॥ శ్రీకర, మాధవ, కేశవ,
రాకాశశివదన, దుష్ట, రాక్షసదమనా!
చేకొనుమనను, రవివంశ సు
ధాకర, శ్రీభద్రశైల, ధామా! రామా!॥ 58

కం॥ కూరిమితో నీదశరథ
తారంబులదలతు భక్తి, తత్పరమతినై
నేరములెన్నక బ్రోవుము
ధారుణి శ్రీభద్రశైల, ధామా! రామా! 59

కం॥ పెనుమీనువగుచు సోమకు
డనుదనుజునిజంపి శృతుల, నబ్జభవునకు౯
మునునొసగనె సురలెల్లరు
తనివారగ భద్రశైల, ధామా! రామా!॥ 60

కం॥ సురలసురులు సుధకై మం
దరగిరిచే వం ధితరచు, తరిగిరిగ్రుంక౯
వరికమఠమగుచు దేల్చవె
ధరమును శ్రీభద్రశైల, ధామా! రామా!॥ 61

కం॥ ధాత్రినీయి హేమనేత్రుని
గాత్రంబును దునుమ సురలు, గనుగొని నిన్ను౯
స్తోత్రములు జేయగానవె
ధాత్రిని శ్రీభద్రశైల, ధామా! రామా!॥ 62

కం॥ ఉరుపేర్మిను ప్రహ్లాదుని
గరుణింపంగను హిరణ్య, కశిపుని దునుమ౯
నరసింహరూప మందవె?
ధరణిని శ్రీభద్రశైల! ధామా! రామా!! 63

కం! వామనుడవగుచు దానవ
స్వామిని పాతాళమునకు, బంపవె త్రిదశ
స్తోమము సంతసమందగ
దామోదర భద్రశైల, ధామా! రామా!॥ 64

కం॥ దురితాత్ముల గర్వాంధుల
ధరణీధవ వితతినెల్ల, దర్పముమెరయన్
సరకవె భార్గవుడవగుచు
ఖరసుతహిత భద్రశైల, ధామా! రామా!॥ 65

కం॥ రాముడవై జనకజగొని
పామరులగు రావణాది! పలలాశనులన్
భూమినిబడగొట్టవె శ్రీ
దామోదర, భద్రశైల, ధామా! రామా॥ 66

కం॥ కూళయగు కంసుజంపను
పాలింపను భక్తనరుల, భాసురముగ గో
పాలుండవై తివిల ప
ద్మాలయ వర, భద్రశైల, ధామా! రామా!॥ 67

కం॥ దురితాత్ములగుచు మెలగు త్రి
పురదైత్యుల దునుమనెంచి, బుద్ధసమాఖ్యన్
బరగితివి ధరణిలో మం
దరధర శ్రీభద్రశైల, ధామా! రామా!॥ 68

కం॥ కలియుగమున సజ్జనులను
పలుబాముల బెట్టుచున్న, పాపులదునుమన్
వెలసెదట కల్కివనభూ
తలమున శ్రీభద్రశైల, ధామా! రామా!॥ 69

క॥ ఈ నీదాసుని నీవే
న్యాయముగా నెంచివిడువ, నో పరమేశా!
నేనెవరియండ జేరుదు
దాసనహర, భద్రశైల, ధామా! రామా!॥ 70

క॥ శ్రీనాథ, భక్తవత్సల,
నానావిధరూప, పాప, నాశనయని నీవా
క్యానంబుల బూజించెద
దానవహర భద్రశైల, ధామా! రామా!॥ 71

క॥ రామానను గాపాడగ
రామానిన నింకనెవరు, రక్షింపంగా
నీమహినిగలరు రా! సు
త్రామార్చిత, భద్రశైల, ధామా! రామా!॥

క॥ మరుపా! లేకుండిన కడు
దురితాత్ములు వీని బ్రోవ, దోషంబనుచున్
సరకుగొనవు నామనవిని
ధరణిని శ్రీభద్రశైల, ధామా! రామా!॥ 73

క॥ శతకోటి భానుతేజా!
క్షితిజా హృత్కమల రాజ, శ్రితసురభూజా!
అతిభక్తదలతునిను సం
తతమును శ్రీభద్రశైల, ధామా! రామా!॥ 74

క౦॥ తనయుడు దుష్టుండైనను
జనకునదే తప్పుటండ్రు, జగతిలో నార్యుల్
జనకుడవు నీవు నీదగు
తనయుడనే భద్రశైల, ధామా! రామా!॥ 75

క౦॥ కనుభక్తితోడ నీదగు
ఆడుగుల నెదనిల్పినతము, నర్చించెదనా
యిడుములు దెగద్రెంపుము యీ
తడవేలను భద్రశైల, ధామా! రామా!॥ 76

క౦॥ వ్యారదానవమర్ధన శుభ
కర భసహార భక్తపాల, ఖగరాడ్గమనా!
యురగాధపశయనా మం
దరధర శ్రీభద్రశైల, ధామా! రామా!॥ 77

క౦॥ విరజాజులు సరసిజములు
మరువము చామంతి బొడ్డు, మల్లెలచే సీ
చరణంబుల బూజించెద
ధరసుతహిత భద్రశైల, ధామా! రామా!॥78

క౦॥ శాపంబా? నేజేసిన
పాపంబా? యెంతనిన్ను, బ్రార్థించిననీ
రూపంబు జూపకుంటివి
తాపసినుత భద్రశైల, ధామా! రామా!॥ 79

కం॥ ఖరదూషణాది రాక్షస
వరు లెల్లరు నిన్ను తాక వచ్చి మడియరే
కరుకగు నీశరతతిచే
ధరణిని శ్రీభద్రశైల, ధామా! రామా!॥ 80

కం॥ పుత్రుఁడు దుష్టుండై నను
శత్రుత్వము బూని తండ్రి, జంపఁదలంచునే?
మిత్రత్వంబున బెంపఁడే?
ధాత్రిని శ్రీభద్రశైల, ధామా! రామా!॥ 81

కం॥ రక్షింపసురలలోనా
ధ్యక్షుండవు నీవటంచు, దలచెదమది సం
రక్షింపుమునను భువనా
ధ్యక్షా! శ్రీభద్రశైల, ధామా! రామా!॥ 82

కం॥ నినునమ్మియుంటి నాదగు
మనమునగల కోర్కెలెల్ల, మరువకకృపతో
డను నొసగెదవనుచును మది
దనుజాంతక భద్రశైల, ధామా! రామా!॥ 83

కం॥ వాసిగలవాడవనివిని
దోసిలిడుచు వేడుచుంటి, దోషినటంచున్
గాసినిడక బ్రోవర నీ
దాసుడ శ్రీభద్రశైల, ధామా! రామా!॥ 84

కం॥ సిరులడిగెదంచు నెంచియు
దరిజేరగ వెరచెదీవు, దైత్యాంతకనే
సిరులడుగ నన్నునీదగు
దరినుంపుము భద్రిశైల, ధామా! రామా!॥ 85

కం॥ పొగరుతనంబున సీతో
పగగొని రావణునకీవు, పరమిస్తి వినే
సుగమముగ వేడబలుకవు
తగునా? శ్రీభద్రశైల, ధామా! రామా!॥ 86

కం॥ డులిరూపంబున మందర
మలనెత్తవె సురలుబొగడ, మాన్యచరిత్రా!
చలమేలరార నాచిం
తలబాపగ భద్రిశైల, ధామా! రామా!॥ 87

కం॥ సురుతరములు బావనములు
సరసిజసంభవునికైన, స్మరణీయంబుల్
పరికింప నీదుచరితలు
ధరణిని శ్రీభద్రశైల, ధామా! రామా!॥ 88

కం॥ అప్పరమేష్ఠి లిఖించెను
యిప్పగదిని నిజము లందు మీానినుచునను
ముప్పులుబెట్టక బ్రోవగ
తప్పదు శ్రీభద్రశైల, ధామా! రామా!॥ 89

కం॥ లావణ్యమైన నీమొగ
మేవేళను జూడ వేడ నేముదిమందన్
దేవా రావా? యిటుల శ్రీ
తావస, శ్రీభద్రశైల, ధామా! రామా!॥ 90

కం॥ నందనుడవంటి నానుచు
లందున దోషంబులున్న, నరయకుమంటిక్
మందరగిరిధర యాప
ద్బాంధవ శ్రీభద్రశైల, ధామా! రామా!॥ 91

కం॥ దనుజాధిపుడగు రావణు
డనుపమమగు నీదుబాణహతి గూలుటచే
గనుగొనియె నాకలోకము
దనివారగ భద్రశైల, ధామా! రామా!॥ 92

కం॥ మునుగౌతమసతి శాపం
బును బాయదె నీపదరజ, మును సోకంగా
వనజదళనేత్ర, దశరథ
తనయా! శ్రీభద్రశైల, ధామా! రామా!॥ 93

కం॥ చేసితిని పాపములు నే
కాసింతయు ముందువచ్చు, గతిగానకనీ
దాసుడనఁబాపు నాదగు
త్రాసంబుల భద్రశైల, ధామా! రామా!॥ 94

కం॥ వినుమా! దీనాలాపము
గనుమా! నీకరుణచేత, కాలుష్యములన్
దునుమాడి జమునివ్యథలే
దనుమా శ్రీభద్రశైల, ధామా! రామా!॥ 95

కం॥ శ్రయమున ననుగావగను స
భయమొసగుము దేవదేవ, భాస్కరసుతుచే
భయమేమియు లేదనుచు స
దయుడవగుచు భద్రశైల, ధామా! రామా!॥

కం॥ చిలువలదొరకైనను యా
నలునకయిన నిన్నుబొగడ, నలవియెయనగా
కలుషాత్ముడ నాకగునే?
తలపగ శ్రీభద్రశైల, ధామా! రామా!॥ 97

కం॥ తనువుల శాశ్వతమనునుడి
వినియును కనియును సతంబు, వెర్రిమనసు యీ
తనువును నమ్మక నినుచిం
తనజేయదు భద్రశైల, ధామా! రామా!॥ 98

కం॥ మనుపక్షిరాజునకు మో
క్షణ మొసగెపురీతినన్ను, సదమలమతితో
గనిగొనియు నాకమొసగుము
దనుజాంతక భద్రశైల, ధామా! రామా!॥ 99

కం॥ రామాయన బల్కెడు నీ
నామాక్షర ద్వయముచేత, నానాభవముల్
ధూమమయి యెగిసి చనునట
దామోదర భద్రశైల, ధామా! రామా!॥ 100

కం॥ శ్రీవిశ్వకర్మకులజుడ
పావనుడగు విశ్వనాథ, పౌత్రుడ నేనీ
సేవకుడను గనుగొనుమ, శ్రీ
తావన, శ్రీభద్రశైల, ధామా! రామా!॥ 101

కం॥ గుణవతియగు గంగమకున్
అనుపమధీశాలి మల్లికార్జునునకునే
తనయుడ నీదగు దాసుడ
దనుజాంతక భద్రశైల, ధామా! రామా!॥ 102

కం॥ ఏను ద్వదీయ పదాంబుజ
ధ్యానపరుడ పొడుగు అప్పలానందాఖ్యుం
డన్ నను, కృపతో జూడుము
దానవహర భద్రశైల, ధామా! రామా!॥ 103

కం॥ నీకరుణచేత శతకం
బీకరణిరచించి నీకె, యిడితిని గొనుమా
నాకేశవినుతపద, సీ
తాకాంతుడ, భద్రశైల, ధామా! రామా!॥

కం॥ వరవిభవ వత్సరంబున
బరగెడు భాద్రపదశుద్ధ, పంచమి బుధవా
సరమున నీశతకము నీ
దరినుంచితి భద్రశైల, ధామా! రామా!॥ 105

కం॥ ఆశశిరవితారలిల ప్ర
కాశించెడు వరకునీదు, కారుణ్యముచే
నీశతకమలర జేయుము
దాశరథీ! భద్రశైల, ధామా! రామా!॥ 106

కం॥ నిరతము నీశతకంబును
స్మరియించెడు, భక్తతతికి, సకలార్థంబుల్
సరగున దయజేయుము మం
దరగిరిధర భద్రశైల, ధామా! రామా!॥ 107

కం॥ మంగళము కదనభీమా!
మంగళమిదె గొనుమభక్త, మానసధామా!
మంగళము భవ్యనామ ప
తంగధ్వజ, భద్రశైల, ధామా! రామా!॥ 108

శ్రీ భద్రశైల రామశతకము
సమాప్తము.

Printed at the V R. C. Press, Vizag—3·31—1000.

## ప్రకటన.

నాచేరచియింపబడిన భజనకీర్తనలు తదితర పుస్తకములు నాయనుమతిలేనిది యెవరును ముద్రించి ప్రచురింపగూడదు.

| | |
|---|---|
| శివశతకము | పద్యములు. |
| భద్రశైల రామశతకము | ,, |
| రామప్రభుస్తోత్ర పద్యవింశతి | ,, |
| రామస్తోత్ర కదంబము | ,, |
| శింభుస్తోత్ర నక్షత్రమాల | ,, |
| నూతన మేలుకొలుపులు | |
| ఆనంద భగవన్నామ సంకీర్తనలు | |
| రామకథాగీతము | |
| దశావతారస్తోత్ర దండకము | |
| దామోదరాష్టోత్తర శతపదస్తోత్రము | |

పై పుస్తకములు వలయువారికి ఏ.బి.యస్. ప్రెస్సాఫీసులో దొరకును.

విశాఖపట్టణము,
26-3-31.

ఇట్లు
పొడుగు అప్పలానందము.

---

ముఖపత్రము విశాఖపట్నం సిటీ ప్రెస్‌నందు ముద్రితము.